# పీఠిక.

నాయనేకగ్రంథములందలి చిత్రబంధగర్భ కవిత్వమునంతను విడఁదీసి దానివలచు పెక్కండ్రకది సులువుగఁజిక్కి యుపయోగించునట్లొక పుస్తకముగఁ బ్రకటింపుమని నాతోఁ బెక్కుఱు మిత్రులనిరి. కానియంతయుఁ బ్రచురించినం బెద్ద గ్రంథమగునని కందపద్యాస బంధ మున్నంతవఱకుమాత్రమె చాలభాగమేరికూరిచి యీపేరిడి దీనిని వెలువఱచితిని. ఇదితలవడునప్పటికి "కందము చెప్పిననే కవి, పందినిబొడిచిననే బంటు" అన్నట్లు సమర్థతకుదురును పైది లేదన్నకొఱఁతయుండదు. ఇందాద్యంతంబులఁగలకొన్నికందాలు ప్రస్తుతాంశ సంబంధములు కాకున్నవానిఁ జూచిముచ్చటపడు కొందఱిప్రీతికయియ్యవి జతపఱపఁబడినవి.

అసాధారణవిద్యయగు నీకవిత్వమబ్బి కవిపుట్టినందులకు దీనికి జతగా దేవుఁడు తనకీవిషయమందు మంచిప్రవేశముకలిగించెనో దానిని సాకల్యముగనేరిచి యదిలోకమున సువ్యక్తమగులాగునఁ జేయుటకుఁ దగినసద్గ్రంథములను రచించుటే తనపనిగాఁదలఁచి యదినిర్వహించిననె తనజన్మము సార్థకమైనదనుకొనుటయే యతనికివిధి, కవికిదే భగవదుద్దిష్టముఖ్యధర్మము. ఇట్లయిననే కవిపేరుండును.

కొందఱుకవులకు ఆశుధార అవధానము చతుర్విధకవిత్వరచన వంటిపెచ్చునేరుపులుండవచ్చును. ఇవియెల్లను జనరంజక విషయములె కాని యింకేజగదుపకృతికి నక్కఱలేనివి. ఇందొక్కటియెకదా మన ప్రకృతవిషయము. ఈపనిలోనఁగవికి నోరుపునేరుపు లొండొంటినిమించియుండవలెను.

గతకవీంద్రులందెల్ల గణపవర వేంకటకవిగారె యిందెక్కుడు పరిశ్రమచేసి యుండినట్లు తత్కృతప్రబంధరాజ విజయ వేంకట విలాసము చాటుచున్నది. అదిచాలకష్టశైలినుండును. నాకీపనిలోన మక్కువం బుట్టించినది మాత్రమదే. నాబుధవిధేయిని పత్రికలో నేను వెల్లడించిన కొన్నిచాటువులపుడప్పుడు చెప్పుచు నలవఱచికొంటిని. సోమేశ్వరీయము

నందువలన గొన్ని వ్రాసితిఁగాని యదిప్రథమయత్నమగుటచేఁ గ్లిష్ట పదములుప్రయోగించియె పనినెట్టఁగలిగితి. పిదపనద్భుతోత్తరరామాయణమునఁబూనికతోఁజాలవ్రాసియుఁ గష్టపదములు మితముగనె వాడితిని. తదనంతరపు గురుభక్తిప్రభావ కృష్ణామాహాత్మ్యాదు లందుఁ జెప్పఁబడినదియునింకెన్నియో చాటువులందలిదియుమిగుల తేలికపదములతో నెకుశిరినది అభ్యాసవశమున సుస్వాధీనమగుచుండుట యేమివింత?

నాసామాన్యపుశక్తితో నెకొన్ని క్రొత్తబంధములను మితిమీఱిన గర్భితములను నేనేర్పఱుపఁగలిగితి. నిబాధన లిబ్బడి ముబ్బడిగఁ గూడఁబెట్టికొని పనినిర్వహించితి. మంచిపరిశ్రమకల బుద్ధిమంతులెందఱోయుందురు. అట్టిదిట్టలు తిన్నగాఁదలంచికొన్న నెన్నెని కల్పింపఁ గలరుగదా. వారిప్రయత్నమునకు నేను మార్గదర్శకుండనుగాఁ గలిగితినన్నను నాకదియెపెద్దబహుమతిగా సంతసింతమనియె యిదిట్టుల వ్యాపింపఁజేయుదు.

చిత్రకవిత్వమందుఁ బద్యము పేరికనుగుణముగనున్న వైనమును బంధకవిత్వమునఁ బద్యహారముగ్గునన మరిచెప్పినట్టుచొప్పడిన యొప్పిదమును, గర్భకవిత్వములోఁ బద్యములయెన్నిక యన్నలెక్కకు సరిపడి యున్నవివరమును బరిశీలింపుఁడు. ఇంకనుగల యెక్కువలుసైతము చూతమని ప్రీతిపడుసరసులుందురేని వారిపుస్తకము చివరనున్న జాబితానుజదివి యందిపుడు చిక్కఁగల వానిలోఁ దమమక్కువకగునవి తెప్పించికొని చూడఁబ్రార్థితులు.

దుందుభివిజయదశమి
బందరు
జగన్నాథపురము

నాదెళ్ల పురుషోత్తముఁడు



శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః.

# చిత్రకందపద్యరత్నాకరము.

## శివస్తోత్రము.



(అద్భుతోత్తరరామాయణమందలి యంత్యనియమములు.)

శ్రీకైలాసనివేశా । స్వీకృతపద్మాలయేశ విజితరతీశా
ప్రాకృతపాపవినాశా । నాకేశమునీశముఖ్య నతలోకేశా
శ్రీకరహీరాకారా । ప్రాకటరణవీరమేరు పర్వతధీరా
లోకాధారాభక్తవ । శీకరవ్యాళేశహార సింధుగభీరా
శ్రీమహితగానలోలా । సామజదనుజేంద్రకాల సత్వసుశీలా
సోమేశ్వరదిక్చేలా । ధీమజ్జనకల్పసాల త్రిభువనపాలా
హృతమదనదళితశమనా । సతతాసురవీరకదనజయశశి వదనా
నుతరదనాంచితమండన । హితకైలాసాద్రిసదన హితసౌఖ్యదనా
హరివిధిపూజితచరణా । గిరిరమణసదావిహరణ గిరిజాదరణా
కరిదానవసంహరణా । వరనాగాభరణవిజిత వైరిపటురణా
వరవృషభరాట్తురంగా । గిరిజామనసాబ్జభృంగ గీష్పతిరంగా
సురపతికమలపతంగా । తరశృంగామాళిగంగ దానవభంగా
శుభకరప్రజ్ఞామేధా । విభవాకరమౌనినాధ వితతిసుబోధా
అభయకృతవిష్ణువేధా । ఇభసంహారవిమలగాధ హృతబుధబాధా
వరశేషాహిపభూషా । నిరుపమపరిపూర్ణతోష నిర్జరపోషా
కరుణావిశేషదోషా । కరధరమృదుమధురభాష కల్మషశోషా
సోమాభవహరనామా । శ్యామాహృదయాభిరామ శాసితకామా
ప్రేమాకరనగధామా । సోమధరాశేషదామ సురరిపుభీమా

## —♦ చి త్ర క వి త్వ ము. ♦—

(సోమేశ్వరీయమునందలివి)

ఆద్యికము— నెలతాలుప! నీనగుమొగ । మలమలరాయని కొమరితయనుతొవకి య్యె । న్నెల; కాదా వెన్నెలతాఁ । దులనీయనము నకుమఱుఁగుదూరఁగ లేమిన్ ॥

సాంస్కృతికము— సరసీరుహాసంభవముర । సురరిపుసంహార వృత్రసూదనకోటీ । రరమణరత్నవిరాజిత । చరణాబ్జరజః ప్రపూత జలజభవాండా ॥

సర్వాదంతము— భవమానాయకకమలజ । భవఘనవాహా ద్యమర్త్యపాలకవరదా । భవహారపర్వతరాట్సం । భవనాథాభక్తకల్ప పంచశరహరా ॥ (కమలము= జలము)

త్రిప్రాసము— సుందరమునీదురూపము । మందరముధరించి నతఁడుమగువైకనెనే । మందఱమెఱుఁగుదుమప్పుపు । రందరముఖపతి వటంచురాజార్థధరా ॥

నిరోష్ఠ్యము— జలజరుహాశ్రకులదరుచు । జలజాక్షునిఁగూర్చి కొంచుఁజయ్యననిన్నుం । గులగిరిశరాసనుంగనఁ । గలయిక్కట్లన్ని తీర్చి కాతుకదసదా ॥

నిరూష్మనిరోష్ఠ్యము—కరిదైత్యాంతకకాంచన । ధరణీధరధారి రాజధరనగధీరా । కరుణాకరాగరళకం । ధరచంద్రార్కాగ్నినేత్ర తారకగాత్రా ॥

అంకగణితము— ఏకాద్విసఖ్యాత్రిణయన । మూకుఁజతుర్వాస్త పంచముఖషడ్వదనా । త్సకరసప్తమునిస్తుతి । మూకష్టైశ్వర్యము విడి మనుపునవదశన్ ॥ (మూకున్= దీనుడన్)

కసగుణితము— కిరికాలకిల్కకీలక । కురుకూటమికేళికైవకోల మునీకా । నరిసాంబసిలుగుసీయును । సురసూరీసేగిసైపసోమిసౌరా ॥

(కిల్కకీలక = పాపమునకుఅగ్ని, కుఱుకూటమి = చిన్న సభ, కోలము= నృత్యము)

నవగ్రహి— రవిసోమవహ్నిలోచన । శివమంగళకరబుధాప్త

శ్రీగురునాథా । కవిమందభాగ్యవారక । నవహారఫణిరాజధర వృషభ కేతుయుతా ॥

దశావతారి—హారమీనాంకారికమఠ। కరమిత్రవరాహా నీరఘన రహారీవా । మరమద్రామూరామా। వరరామస్తుతిసుబుద్ధిపరిజనకలికా॥
(కమఠము= కుబేరునికత్తి, ఘనరహారీ=గొప్పపాపమునశింపజేయువాడా,కలికా=కల్కియా)

సాంవత్సరి— శుభకృచ్ఛ్రీముఖసౌమ్య । ప్రభవానందస్వభా నుభావవిజయుడుం । దుర్భిశోభకృదతులయజయ । విభవామన్మథవిరోధి విక్రమవృషగా ॥

(ప్రభవ...భావ= నుండిపుట్టిన సంతోషముసాంత కాంతిగలవాడా)

చతురక్షరీశివపంచదశి— శివమనమున్శివమననము । శివవన మున్శివవనమ్ముశివమున్శివము । న్శివశివశివశివశివ । శిః వశమనశివ వశమ్మొశివమ్మును మేశా ॥

(ఓసాంబా! పార్వతీదేవిమనస్సుశుభమునకును శంకరధ్యానముసుఖమునకును కర కలుజమ్ములు నుసిరిగలునున్నయడవినక్కలకును పెద్దపాములకును శివానదీజలము వలల గుండ్లమును ఆకాశము చిలుకలకును నీరు ఇసుకకును వశములయియున్నవి మాటచెప్పు టకు మోక్షము వేదమునకువశమయియున్నది. పరమార్థము:- అంతయుశివమేఅంతయు శివాధీనమేయనుట)

త్ర్యక్షరి— నియమనియామామాయమయమ । నయమయనాయ మననిన్నునమ్మినవోయీ । యయయయనయమ్మున్మాయని। మయిమమ్మ న్మొనయనీయమనమునననుమీ ॥

ద్వ్యక్షరి— నీనామమునెమ్మనమున । మానననీమమునవమ్మి మననూనినన । న్నానానానెన్ననసను । మేనేనామానమనన మేనున్న వా ॥ (మేనేనా= విష్ణువల్లభా)

ఏకాక్షరి— నానానేనానినునుని । నానన్నానాననానెనన్ను న్ననా । నానానన్నెనన్నను । నానానానేనినెన్ననోనానేనా ॥

(నుని= వినాయకుని, నా= శివా, నాక= నరుడక)

(నాయనా!గణపతితండ్రివయిన అల్లనిన్నునాతండ్రీఅనగా నేనన్నుకాదు కాదు అంటేనాకుసిగ్గవును నిన్ను నేనునాన్నాఅంటే నీవునొప్పికలుగునవచ్చునా? నిన్నెంచి

నన్నో నావే; నేను నావే; 'ఆత్మావై పుత్రనామాసి' అనుశ్రుతివాక్యమునుబట్టి తండ్రిని బోలి కొడుకుండుట విధియేకదా)

## —♦ బంధకవిత్వము. ♦—

రథము — శ్రీదాసోదారా రామా। మేదంబడ్డట్టు విశ్వమెల్లనెఱుంగు। న్నాదరముగ హరిభక్తులు । నీదోహలమంద వేడ్క నెంత్రిదిలెక్కా ॥
(దోహలము= ఆనందము)
(ఇదిసోమేశ్వరీయమందలిది 'శ్రీసోమేశ్వరనీ వేదిక్కా', అనినడుమను విడ్డుపడి కానబడును)

రథము — అత్యద్భుతమహితోద్ధృత । నిత్యాధ్యాత్మప్రభావ నిర్మలచరణా । సత్యోత్సాహాధీరా । రాత్యంతికగౌరిమార రమ్యాయుగుణా ॥ (ధీరా...తక= జంకులేని వైరులజంపువాడ)
(ఇదిఅద్భుతోత్తరరామాయణమందలిది 'అద్భుతోత్తరరామాయణా', అనినడుమ నేర్పడును.)

రథము — శ్రీదాకృష్ణాస్తోత్ర । ష్ణాదాహకదివ్యనవ్యశ్రమదా నిత్యా । మోదితభక్తాజ్ఞానా। హ్లాదమయా నిఖిలమహితమ్యానిమహిమే॥
(ఇదికృష్ణానదీమాహాత్మ్యమందలిది 'శ్రీకృష్ణానదిమహిమమే', అనివడుమను గనంబడును.)

ఖడ్గము — ధీరసురవారశుభకర । వారణరజనిచరేంద్ర హారక నాథా । ధారాధరగమనభయుని । వారణమాసీంద్రబోధపావనగాథా॥
(కృష్ణానదీమాహాత్మ్యము)

చతురంగము సర్వలఘువు — ప్రవిమలచరితము విపులము । శివశితసురుచికలదపును వృష.గవినుమనిశ । వ్యవహితగతింబొగడరునిమ్ము । జవగలగడుసుబలియుండు గజగము లెఱుంగుటన్ ॥

(ఇదిఅడ్డమున 64 గదులలోను వ్రాయగా 2వ బారునిలువునజూడ 'పురుషవరుడు', 4ట 'కవితను', 7ట 'శివునిబొగడుట', అనియగపడును)

చక్రము — హరనాసదుత్తమవినుతి । లరహిమదికిదెల్పన దిదళమయికదకదా । తిరమగువిపులపుంగరుణను । రురుచిక్రుదనుమతి నిడుమతిరుచిపోత్పత్తిక్ ॥

(సోమేశ్వరీయమందిని 6వ 3వ చుట్టులందు 'నాదెల్శపురుషా', 'త్తుకవికృతి', అనియేర్పడును) (ఓశివా సుఖదాతా భూమియందు నాశాంతమయి శ్రేష్ఠమయిన పొగడ్త మనస్సునకుత్సాహమును బోధపఱపగా విషయము బలపడియే కాదా మనస్సనెడిబూరెల మూకుడు నందలిపుట్టుకనుబట్టి (పిండివంటవలె) మంచిచవినిగలిగించునట్టి సమ్మతితో శాశ్వతమైనగొప్పదమును ఇచ్చును)

సవిశేషరథపదము— పఱపుముతగుకృపధరధర । పరిచితరు చిరవిదుషోత్కృష్టమధశివరతిక । వరహితమిత్తనియుడుగక । మురిపెము గుఁగుదురఁదరుణమున్నుడు సాంబా ॥

(గురుభక్తిప్రభావమందలిది. దీని 8, 7, 6, చుట్లలో 'పరశివగురు, కృపధరగుణ, గురిమహిమను, అనియు 3 వ చుట్టున 'పురుషోత్తముడు, అనియు నేర్పడి కానఁబడును)

గోమూత్రిక— ధరనాయకితనయావర । సరసీరుహమిత్రసరస సనకాదినుతా । సురగేయశ్వేతకాయా । స్మరహారకరుగమిత సహా సహానద్యుదితా ॥ (సోమేశ్వరీయము)

(రుగమిత...దితా= ఈషణముల యొక్కయు రోగముల యొక్కయుగొప్ప పటుత్వమును లెక్కసేయనినదిలోబుట్టినలింగమూర్తీ!)

గోమూత్రిక— గరధరవిరహితభావా । కరిహరహరిహితప్రముదితఘనమమువిందో । పురహరసురనుతదేవా । హరిశరపరిణతిసము దితయునయముగందో॥ (అద్భుతోత్తరరామాయణము)

పుష్పమాలిక— సురవరశరణ్యాకనకని । కరసరసబిసజకలికసుకనదపదపదా। పరిదారితారిభీకర । కరకసమసమస్తమస్తకటకసకదా॥ (సోమేశ్వరీయము)

(దేవోత్తములకుశరణుచొరదగినట్టిదై బంగారపుదై శ్రేష్ఠమయి సవంతమైనతామర మొగ్గవలెబాగుగ బ్రకాశించు మనదియై ఒకతావనక అంతటనుగలదగుచరణము గలవాడా! వ్రక్కలుచేయబడ్డట్టివైరుల భయంకరములయిన బుడిచొలులవంటి అన్నితలకాయలును గలవాడా! పర్వతమునడిపట్టుననున్నవాడా! సుఖమిచ్చువాడా!)

పుష్పమాలికాగోమూత్రికాద్యనేకవిధవిరాజమానము- మురహరహరపురహరదొర । ధరధగధరస్మరహరహర ధరగకుధరభా । దరికరహరసురవర । దరకరగరగరధరదరధరనరవరదా॥ (అద్భుతోత్తర రామాయణము)

(ధరగ...వరదా= కొండపైదగువాడా! నరకపుతీక్ష్ణమైనబరువునుండి తొలగించి కాపాడువాడా! పాపముపోగొట్టువాడా! దేవోత్తములకుభయంకర వ్యాధియైన విషమును దాల్చినవాడా! కృష్ణార్జునులకు వరదుడా!)

చతుర్థపాదగోపనము—ఘననుతిగజదనియనుగ్రహము। మునవా

సుధ్యానసూనిముడిచికడనుజేఁ। గొనసునున్నదుశుభ దేవా । ఘనుగనినుఁ
మనసునసిడికనుఁగొనుదుభ వా ॥ (కృష్ణానదీమాహాత్మ్యము)

(మొదటి 3 చరణాలలోని బేసి యక్షరము లే 4 వ పాదమగును)

## ―♦ గర్భ కవిత్వము. ♦―

సర్వలఘుగీతి— కరుణగలిగి, జనకులుగలగటనినఁ। దమసములు గలలనయినసుమహిఁబరగఁ। గలరెయనుచుభువినినరులలర్థుదురిది। సహాజమునయనియమమునవుహారరహర ॥ (సోమేశ్వరీయము)

క॥ కరుణగలిగినజనకులుగ। లరటనినదమసములుగలలనయినసుమహిఁ। బరగగలరె
యనుచుభువిని। నరులలసుదురిది సహాజమునయనియమమునా ॥

మణిగణనికరము— కరఘటితకనకకలశముకరుణా । కరయమృతమునిచికడునియమమునఁ । బొరపడకెపుడునుబొదుపుదుబరువా । బరిఁదగుసుసగముపరిమితినిడుమిా ॥ (సోమేశ్వరీయము)

క॥ కరఘటితకనకకలశము । కరుణాకరయమృతమునిచి కడునియమమునఁ। బొరపడ
కెపుడునుబొదుపుదు । బరువాబరిదగుదుసగముపరిమితినిడుమిా ।

### సగర్భకందగీతి చంపకోత్పలమాలలు.

సోమేశ్వరీయము— శివనన్ను బ్రోవరామదినిజంతనచేసెదమానకేనుదా । నవవరదావినన్ను భవదనంతవిలాసముబల్కుసందురా । భవనినువీడఁబోభవముఁ బాయునుపాయపుఁబట్టెటింగియుం । డవలనిదేయిఁకగొలంపడగ్గరుచేసదికొట్టివైతురా ॥

క॥ ననుబ్రోవరామదినిజం । తనచేసెదమానకేనుదానవవరదా। నినువీడబోభవముపా।
యునుపాయపుబట్టెటింగి యుండవలనిదే ॥

(ప్రతి పాదమధ్యగతనగణాదిగా గీతపద్యచరణములుండును)

ధార్మికోల్లాసిని— శివనగరేశ్వరామహితశ్రీనగనాయకమాధవాప్తనా । కవిభునుతాహరాసతతకాంచనభూధరచాపదేవభా। ధవనిగమాంచితావరద దాసఁగనేలభవద్ధితుండభై । రవజనకానసుంగరుణరక్షణచేయుముకన్యకాపతీ ॥

క॥ నగరేశ్వరామహితశ్రీ । నగనాయకమాధవాప్త నాకవిభునుతా। నిగమాంచితావర
దదా । పగనేలభవద్ధితుండ భైరజనకా ॥

గురుభక్తిప్రభావము — భవహరశ్రీకరావరద భాస్కరకోటి నవప్రకాశ గా। రవమహితాలసత్తరళరమ్యశరీరబుధప్రధానయో। శివ కరుణాకరాదివిజశేఖర వందితదీనపోషకా। మ్మవనదవానలా గిరణుమా ధవసాయకసర్పభూషణా ॥

క॥ హారశ్రీకరావరదభా। స్కరకోటినవప్రకాశ గౌరవమహితా। కరుణాకరాదివిజ శే। ఖరవందితదీనపోష కామవనదవా ॥

కృష్ణానదీమాహాత్మ్యము — శ్రీనగజేశనీమహిమగుర్జేర్వంగగౌరి యమందభక్తిబ। ల్ధ్యానములన్నదానెఱపఁదన్నియమంబు గణింపనేలయా। యూనగుమోమొగింగననెహోయిగనుండఁగఁగల్గుఁగాదెయీ। శానశివా పతీగిరిశచక్కనిప్రీతిసుఖంబనిమ్మయా ॥

క॥ నగజేశనీమహిమగుర్జే। ర్వగగౌరి యమందభక్తిబల్ధ్యానములన్। నగుమోమొగింగనన హో। యిగనుండఁగఁగల్గుఁగాదె యీశానశివా ॥

మత్తేభకందఘటితసీసము — (గురుభక్తిప్రభావము) సముచితా రాధన సర్వకాలమును నిత్యోత్సాహమేపారనోర్పుతోడ। సురుచిరాం గామధుసూదనాబ్జజులు ధీరోదారులేచేయఁగోవినంగ। బ్రవచనీయం బగుప్రాభవంబలరు నెవ్వారుంద్రమనిఁబోలవాసియందు। రసచమత్కా రమెరాజకీవిఁజెలుచుస్వామీ నిజంబెన్నఁగామువైరి॥ గిరితనయహృ త్సరోరుహ తరణికుముద। బాంధవార్ధధరబహుశోభాగిరీశ। వరనిగ మవర్తినిరుపమపురహారకరు। ణాపయోధపురుషవతంసాపరేశ ॥

క॥ గిరితనయహృత్సరోరుహ। తరణికుముదబాంధవార్ధధరబహుశోభా। వరనిగమవర్తి నిరుపమ। పురహారకరుణాపయోధి పురుషవతంసా ॥

(ప్రతిసీసపాదమున మొదటి 1చివర 3 అక్షరాలువిడిచితే మత్తేభమగును)

సకందస్రగ్విణీభుజంగప్రయాత ప్రాసాంత్యనియమఘటిత దండక కల్పసీసము — (గు - భ - ప్ర) సోమనాథాశివాస్వామిరక్షింపుశ్రీసాంబ మూర్తీననున్నాయ్యయవర్తి। కోమలాంగాభవాకామ విద్వేషిప్రఖ్యాత కీర్తినిన్నుస్తుతునార్తి। వామదేవానవారామలింగాయసంప్రస్తుతింతుం గదాభావపూర్తి। సోమధారీభవత్సామమ్మార్గంబుఁ బ్రస్తావనుంతున్న దాసత్వమూర్తి॥ పరమముదమంది ప్రోశ్రీదుపరమపురుష। భక్తవసలి

భవ్యాత్ములు భాస్వరులుగ । నిన్నెపుడు విడరు మఱియు నిరుపమాన। సుఖ
ముమాకిమ్మనుచునుందు చూవె వారు ॥

క॥ పరమముదమునందిపో చెదు । పగమపురుష భక్తవరుల భవ్యాత్ములు భా। స్వరులుగ
నిన్నెపుడు విడరు । మఱియు నిరుపమాన సుఖము మాకిమ్మనుచున్ ॥

(సీసపాదములందు మొదటి 5 ది మొదలు చివర 7.వ అక్షరము వఱకు భుజంగ
ప్రయాతము 7 వది మొదలు 5వ దానివఱకు స్రగ్విణియు)

కతిపయచిత్రపదమత్తకోకిలా కందద్విపద సాంకిత కీర్తనాంచిత
సీసము— (గు - భ - ప్ర) సామజాంతక సాంబ సాదర స్వామికామిత
దాయకా, ఘనమిత్రసోమ। శ్రీమహేశ్వర సేవ్య శ్రీకర క్షేమధామ విధా
యకా, ధరమాననిలయ । కామసంహార కాలకర్కశ భీమగరాంత
కా, పృథుమంత్రనిరత । శ్యామలోత్పలచంద్రశంకర సామనామపురాం
తకా, నయమహితపథగ ॥ నయము చేపట్టిన నరివనమునకగ్గి । వయిసు
జనవరుల న్నను తెయధినాథ । దయను బుధపోత్తము విధేయునయ భ
యమ్ము । లొనరంగమనుపుడువు కాదె యోమహేశ ॥

(ప్రతిపాదాంతిమము, నెత్తుగీతంబూర్వార్థముంగూర్పకందమగు)

క॥ ఘనమిత్రసోమధరమా।ననిలయపృథుమంత్రనిరతనయమహితపథా। గనయము చేపట్టి
ననరి । వనమునకగ్గి వయిసుజనవరులన్మను తే ॥

(కందము గాక మిగిలిన సీసము మత్తకోకిల. సీసపాదములే ద్విపదలు)

ద్విప్రాసాంత్య నియమఘటిత భాస్కరవిలసితాంచ త్పద్యద్వ
యము— (సోమేశ్వరీయము) కారణమవుదువుగానగధీరా కాంచిన
వివరము తెలిసెడినారా । వారణదితిజదవానల నీరావాంఛిత మొసగగు
మునిరతముదారా । దారుణదురితవిదారణశూరాధార్మికవరబహుశుభ
ములనీరా । ధారణమొనరుతుందప్పక సారాధారనిను హృదిం బొసగ
జితమారా ॥

క॥ కారణమవుదువుగానగ । ధీరాకాంచినవివరము తెలిసెడినారా । వారణదితిజదవా
నల। నీరావాంఛిత మొసగమునిరతముదారా॥ 1 ॥ దారుణదురితనివారణ। శూరాధార్మిక
వరబహుశుభములనీరా।ధారణమొనరుతుగప్పక। సారాధారనినుహృదిబొసగజితమారా 2

సమచిత్రపదాదిమ మణిగణనికరాంతిమ కందద్వయోప గము
సరసిజము— (అద్భుతోత్తర రామాయణము) ధీరమ్యాసింహాచల,ధీరా

స్థిరమతిసురపవిధి మునులుసురలుఁ; । ధారాస్థా హేమాచల, ధారిదరిఁ దగుతేజనుఁ దరుఁగనినుతులుఁ ॥ పారంగోదారాభృత, భారాపరిపరి విధములఁ బ్రణతులొనరుపఁ; । హారాహీంద్రాంచద్భుహు, హారాయు రయుమనుదమున నభయుతమనుపఁ. ॥

(గుఱుతులనుబట్టిచదువ బైవృత్తమువలె 2 కందములుందేలనగును)

చతుర్ముఖి — (సోమేశ్వరీయము) వనమాలిధాత్రృవాసవ ! వినుతాకరిదైత్యహారణ విశ్వవిహారణా । మునిరాట్కమలదివాకర। ధనదాపురజైత్రిసర్వధర్మ వివరణా ॥

కరిదైత్యహారణవిశ్వవి । హారణామునిరాట్కమలది వాకరధనదా ।
పురజైత్రిసర్వధర్మవి । వరణావనమాలిధాత్రృ వాసవవినుతా 2
మునిరాట్కమలదివాకర । ధనదాపురజైత్రిసర్వ ధర్మవివరణా ।
వనమాలిధాత్రృవాసవ । వినుతా కరిదైత్యహారణ విశ్వవిహారణా॥ 3
పురజైత్రిసర్వధర్మవి । వరణా వనమాలిధాత్రృ వాసవవినుతా ।
కరిదైత్యహారణ విశ్వవి । హారణా మునిరాట్కమలది వాకరధనదా॥ 4

అష్టముఖి—(గుఱుభక్తిప్రభావము) స్థిరమతిఁ దలఁతును మురహార । శరనినుఁ దలఁగని కరణిని జలమొగిఁ బొలియఁగ॥ గరిమము మెలఁగను బురికొను । వరములు మెలపుము తిరమయి వలయిత ములుగఁ। (సర్వలఘువు)

మురహారశరనినుదలగని । కరణినిజలమొగి బొలియను గరిమము మెలగఁ
బురికొనువరములు మెలపుము । తిరమయివలయితములుగను స్థిరమతి దలతుఁ
దలగనికరణిని జలమొగి । బొలియనుగరిమము మెలగను బురికొనువరముల్
మెలపుము తిరమయివలయిత । ములుగనుస్థిరమతి దలతునుమురహారశరనిఁ
జలమొగిబొలియను గరిమము । మెలగనుబురికొను వరములు మెలపుముతిరమై
వలయితములుగను స్థిరమతి । దలతును మురహారశరనిను దలగనికరణిఁ
గరిమము మెలగను బురికొను । వరములు మెలపుము తిరమయి వలయితములుగఁ
స్థిరమతిదలతును మురహార । శరనిను దలగనికరణిని జలమొగి బొలియఁ
బురికొనువరములు మెలపుము । తిరమయి వలయితములుగను స్థిరమతిదలతుఁ
మురహారశరనిను దలగని । కరణినిజలమొగి బొలియను గరిమము మెలగఁ
మెలపుముతిరమయి వలయిత । ములుగను స్థిరమతిదలతును మురహారశరనిఁ

దలగనికరణిని జలమొగి । బొలియును గరిమము మెలగను బురికొను వరముల్
వలయుతములుగను స్థిరమతి । దలతును మగవాంశరనిను దలగనికరణిన్
జలమొగిబొలియును గరిమము । మెలగనుబురికొను వరములు మెలపుము తిరమై

అష్టముఖి — [సోమేశ్వరీయము] హరనినుఁ గొలుతును; సరిగాఁ । ద్వగను; గొలువయిదరికొనఁ; దలఁపుఁగలుగం;। దఱిఁగనఁ దలఁతవు; గరిమను దఱచిన; దళముపు హరువవుఁ; దలకొల్పాలుపన్॥

(గుఱ్తుల ననుసరించి మొదలిడుచు వెనుకదానివలెనే చదువగ 8 కందాలగు)

బహువృత్త బహుకందగర్భిత భాస్కరవిలసితము—(అద్భుతోత్తర రామాయణము) సారసభవనుత సంగరవీరా సంతతగరధర విరహితయోగీ। మారమణఘటిత మంగళశూరా మంత్రక పురహర సురనుతత్యాగీ। చారుమణిలసిత జంగమహారా క్షాంతిద స్మరహర హరిహితరాగీ। భైరవ నయయుత భంగహా భారాభ్రాంతిహా హరిశర పరిణతభోగీ॥

సారసభవనుత సంగర । వీరాసంతతగరధర విరహితయోగీ
మారమణఘటితమంగళ । శూరామంత్రక పురహర సురనుతత్యాగీ 1
సారసభవనుతసంగర । వీరాసంతతగరధర విరహితయోగీ
చారుమణిలసితజంగమ । హారాక్షాంతిదస్మరహర హరిహితరాగీ 2
సారసభవనుతసంగర । వీరాసంతతగరధర విరహితయోగీ
భైరవనయయుత భంగహా । భారాభ్రాంతిహా హరిశరపరిణతభోగీ 3
మారమణ ఘటితమంగళ । శూరామంత్రకపురహర సురనుతత్యాగీ
సారసభవనుతసంగర । వీరాసంతతగరధర విరహితయోగీ 4
చారుమణిలసితజంగమ । హారాక్షాంతిదస్మరహర హరిహితరాగీ
భైరవనయయుతభంగహా । భారాభ్రాంతిహా హరిశర పరిణతభోగీ 5
మారమణఘటితమంగళ । శూరామంత్రకపురహర సురనుతత్యాగీ
సారసభవనుతసంగర । వీరాసంతతగరధర విరహితయోగీ 6
చారుమణిలసితజంగమ । హారాక్షాంతిదస్మరహర హరిహితరాగీ
భైరవనయయుతభంగహా । భారాభ్రాంతిహా హరిశర పరిణతభోగీ 7
చారుమణిలసితజంగమ । హారాక్షాంతిదస్మరహర హరిహితరాగీ
సారసభవనుతసంగర । వీరాసంతత గరధర విరహితయోగీ 8
చారుమణిలసిత జంగమ । హారాక్షాంతి దస్మరహర హరిహితరాగీ

మారమణ ఘటితమంగళ । శూరామంత్రక పురహర సురనుతత్యాగీ 9
భైరవనయయుత భంగహా । భారాభ్రాంతిహా హరిశర పరిణతభోగీ
సారస భవనుతసంగర । వీరాసంతతగరధర వింహితయోగీ 10
భైరవనయయుత భంగహా । భారాభ్రాంతిహా హరిశర పరిణతభోగీ
మారమణ ఘటితమంగళ । శూరామంత్రిక పురహర సురనుతత్యాగీ 11
భైరవనయయుతభంగహా । భారాభ్రాంతిహాహరిశర పరిణతభోగీ
చారుమణిలసితజంగమ । హారాక్షాంతిదస్మరహర హరిహితరాగీ॥ 12

చిత్రపదద్విపద చంపకోత్పలమాలానేకవిధ కంద రగడముఖ్య బహుపద్య శతకగర్భిత భాస్కరవిలసితము—(కృష్ణానదీమాహాత్మ్యము) కోరెద గురువరకూరిమికూర్పన్ గుందఁగఁగోఱంతలు గుఱుతునఁగూడన్ జేరెదఁజిరతర చేరువఁజేర్పన్ జెందఁగసిరులను జిరమరఁజిమ్మన్॥ తేరెద స్థిరముగఁదీరికఁదీర్పన్ దెందముతిరమవ్వ తెలఁగునుగొల్పన్ । మారెద స్మరహారమాఱుతు మాఱ్పన్ మందము మరుగవు మరులునునిల్పన్ ॥

కోరెదగురువరకూరిమి । కూరుపగుందగగోఱతలు గుఱుతునగూడన్
జేరెదజిరతరచేరువ । జేరుపజెందగసిరులను జిరమరజిమ్మన్॥
తేరెదస్థిరముగదీరిక । దీరుపదెందముతిరమవ్వ దెలగునుగొల్పన్
మారెదస్మరహారమాఱుతు । మాఱుపమందముమరుగవు మరులునునిల్పన్॥ 1
గురువరకూరిమికూరుప । గోఱతలుగుందగ గుఱుతున గోరెదగూడన్
చిరతరచేరువజేరుప । సిరులనుజెందగజిరమర జేరెదజిమ్మన్
స్థిరముగదీరికదీరుప । దిరమవ్వదెందము తెలగును దేరెదగొల్పన్
స్మరహారమాఱుతుమాఱుప । మరుగవుమందముమరులును మారెదనిల్పన్॥ 2
కూరిమిగూరుపగురువర । కోరెదగుందగగోఱతలు గుఱుతునగూడన్
చేరువజేరుపజిరతర । చేరెదజెందగసిరులను జిరమరజిమ్మన్
తీరికదీరుపస్థిరముగ । దేరెదదెందముతిరమవ్వ దెలగునుగొల్పన్
మాఱుతుమాఱుపస్మరహార । మారెదమందముమరుగవు మరులునునిల్పన్॥ 3
కూరుపగూరిమిగురువర । కోరెదగుందగగోఱతలు గుఱుతునగూడన్
చేరుపజేరువజిరతర । చేరెదజెందగసిరులను జిరమరజిమ్మన్
తీరుపదీరికస్థిరముగ । దేరెదదెందముతిరమవ్వ దెలగునుగొల్పన్
మాఱుపమాఱుతుస్మరహార మారెదమందముమరుగవు మరులునునిల్పన్॥ 4
గోఱతలుగుందగగూరిమి । గురువరకూరుపగుఱుతున గోరెదగూడన్

సిరులను జెందఁ జేరుచ । జిగితఁ జేరుచ జిగమర జేరెద జిమ్మన్
తిరమవు దెందము తీరిక । స్థిరముగ దీరుప దెలుగును దేరెద గొల్వన్
మురుగవు సుందము మాలుతు । స్మరహారమాలుప మురులును మారెద నిల్పన్॥ 5
గులుతున గూడం గోరెద । గురువరకుందగ గొలుతలు కూరిమి గూర్పన్
జిగమర జిమ్మఁగ గోరెద । జిగితగ చెందగ సిరులను జేరుచ జేర్వన్
తెలుగును గొల్వం దేరెద । స్థిరముగ దెందము తిరమవు దీరిక దీర్పన్
మురులును నిల్ప న్మారెద । స్మరహారమందము మురుగవు మాలుతు మాల్పన్॥ 6

(పైనగల జోడు 12 లెక్కను ఈ 6 జోళ్ళు (6 × 12) = 72 కందాలు కాగలవు)

బహువిధ మృదుమధుర గాన ఫణితి పద సానుకూల చిత్రపద ద్విపద నవవిధరగడ బహుసీస తేటగీత ఆటవెలది కంద చంపకమాలా ద్యనేక సహస్రపద్య గర్భితాద్భుత సీసచక్రవర్తిని— (అద్భుతోత్తర రామాయణము) కరిహారగరహారిగరుడగమిత్ర నీకరుణను వేడెద వెలుపుఁ దీర్పు। హరిశరహరిహరి హరివర నేత్ర నీచరితను బాడెదఁ బరగఁ దీర్పు। దరహారధర ధారితరళ సుగాత్ర నీమహిమఁ గనఁ గూడెదఁ గొలుతునాల్పు। హరిహారహరిధారి హరినుతి పాత్ర నీగరిమను వేడెద వరముఁ జేర్పు॥ ధీర సోదార ధీధిత దివ్యమూర్తి। వీరమౌనీంద్ర సేవిత వేదవర్తి। తార లోప్పారునంతకు దండికీర్తి। నిరహిన్ గ్రంథమీనిల నిష్టపూర్తి॥

(హరి= విష్ణువు, యముడు, సూర్యచంద్రాగ్నులు, నీరు, పాము, ఇంద్రుడు)

(ఇతరపద్యాదుల వివరమంతయు అద్భుతోత్తర రామాయణమందు విరళముగా నున్నది అది మనకిపుడప్రస్తుతము ఇందు వెడలుకందముల పైనమ)

కరిహారగరుడగమిత్రా । వెలుపును దీర్పు గరహారి వేడెద గరుణన్
హరిశరహరివర నేత్రా । పరగను దీర్పు హరిహారి పాడెద జరితన్
దరహారతరళసుగాత్రా । కొలుతను నాల్పు ధరధారి కూడెద మహిమన్
హరిహారహరినుతిపాత్రా । వరమును జేర్పు హరిధారి వాడెద గరిమన్ 1
కరిహారగరుడగమిత్రా । పరగను దీర్పు హరిహారి పాడెద జరితన్
హరిశరహరివర నేత్రా । కొలుతను నాల్పు ధరధారి కూడెద మహిమన్
దరహారతరళసుగాత్రా । వరమును జేర్పు హరిధారి వాడెద గరిమన్
హరిహారహరినుతిపాత్రా । వెలుపును దీర్పు గరహారి వేడెద గరుణన్ 2
కరిహారగరుడగమిత్రా । కొలుతను నాల్పు ధరధారి కూడెద మహిమన్
హరిశరహరివర నేత్రా । వరమును జేర్పు హరిధారి వాడెద గరిమన్

దరహారతరళీసుగాత్రా । వెలపునుదీర్పుగరహారి వేడెదగరుణన్
హారిహారహారినుతిపాత్రా । పరగనుదీర్పుహరిహారి పాడెదజరితన్ 3
కరిహరగరుడగమిత్రా । వరమునుజేర్పుహరిధారి వాడెదగరిమన్
హరిశరహారివరనేత్రా । వరమునుజేర్పు హరిధారి వాడెదగరిమన్
దరహారతరళీసుగాత్రా । పరగనుదీర్పు హరిహారి పాడెదజరితన్
హారిహారహారినుతిపాత్రా । కొలతనునార్పుధరధారి కూడెదమెలుగున్ 4

(ఉత్తరార్థచరణము లాదినుండి యొకటి విడుచుచుజదువ నీ 4 జతలైనవి అవి చివరనుండి అట్లైవిడుచుచు జదువగ నింక 4 జతలవును అనగా ఆ ఒక్కజోడే 8 జోళ్లయినవి. వెనుకటి లెక్కను ఈ ప్రతి జోడును ఆజేసిజతలుగా జేసినచో ఈ జతయే మొత్తాన 96 కందములు కాగా 16 మాత్రమువచ్చినవె తిరిగివచ్చి నికరము ఎనుబది (80) శేషించును. ఇంకెన్నిజతల కంవాలింకాలభించినవన్నియెనుబదులగును.)

కరిహారకరుణను వేడెద । గరహారీ వెలపుదీర్పు గరుడగమిత్రా
హారిశరచరితను బాడెద । హరిహారీపరగదీర్పు హారివరనేత్రా
దరహారమెలుగునగూడెద । ధరధారీకొలతనార్పు తరళీసుగాత్రా
హారిహారగరిమనువాడెద । హరిధారీవరముజేర్పు హారినుతిపాత్రా 2
గరహారి వెలపుదీర్పుము । కరిహార వేడెదనుకరుణ గరుడగమిత్రా
హారిహారిపరగదీర్పుము । హారిశరపాడెదనుజరిత హారివరనేత్రా
ధరధారికొలతనార్పుము । దరహారకూడెదనుమెలుగు తరళీసుగాత్రా
హరిధారివరముజేర్పుము । హారిహారవాడెదను గరిమ హారినుతిపాత్రా 3
కరుణను వేడెదగరిహార । గరహారీ వెలపుదీర్పు గరుడగమిత్రా
చరితను బాడెదహారిశర । హరిహారీ పరగదీర్పు హారివరనేత్రా
మెలుగునగూడెదదరహార । ధరధారీకొలతనార్పు తరళీసుగాత్రా
గరిమనువాడెదహారిహార । హరిధారీవరముజేర్పు హారినుతిపాత్రా 4
కరుణను వేడెదగరహా । కరిహారతీర్పుము వెలపును గరుడగమిత్రా
చరితను బాడెదహారిహా । హారిశరతీర్పుముపరగను హారివరనేత్రా
మెలుగునగూడెదధరధా । దరహారనార్పుముకొలతను తరళీసుగాత్రా
గరిమనువాడెదహరిధా । హారిహారచేర్పుమువరమును హారినుతిపాత్రా
వెలపునుదీర్పుముకరుణను । గరహారీవేడకరిహార గరుడగమిత్రా
పరగనుదీర్పుముచరితను । హరిహారీ పాడహారిశర హారివరనేత్రా

కొఱతను నాట్యము మఱుగున । ధరధారీ మోదగహార తరళీసు గాత్రా
వరమును జేర్పుము గరిమను । హరిధారీ మోహహరిహార హరినుతిపాత్రా 6
వెఱపును దీర్పుము వేడెద । గరహారీ మోకరిహార గరుడగమిత్రా
పరగను దీర్పుము పాడెద । హరిహారీ మోహరిశర హరివరనేత్రా
కొఱతను నాట్యము కూడెద । ధరధారీ మోదరహార తరళీసు గాత్రా
వరమును జేర్పుము వాడెద । హరిధారీ మోహరిహార హరినుతిపాత్రా 7
గరహా గరుడగమిత్రా । వెఱపును దీర్పుము కరిహార వేడెదకరుణన్
హరిహా హరివరనేత్రా । పరగను దీర్పుము హరిశర పాడెదజరితన్
ధరధా తరళీసు గాత్రా । కొఱతను నాట్యము ధరధర కూడెదమఱుగున్
హరిధా హరినుతిపాత్రా । వరమును జేర్పుము హరిహార వాడెదగరిమన్
గరుడగమిత్రా గరహా । వెఱపును దీర్పుము కరిహార వేడెదకరుణన్
హరివరనేత్రా హరిహా । పరగను దీర్పుము హరిశర పాడెదజరితన్
తరళీసు గాత్రా ధరధా । కొఱతను నాట్యము ధరహార కూడెదమఱుగున్
హరినుతిపాత్రా హరిధా । వరమును జేర్పుము హరిహార వాడెదగరిమన్ 9
గరుడగమిత్రా కరిహార । వెఱపును దీర్పు గరహారి వేడెదకరుణన్
హరివర నేత్రా హరిశర । పరగను దీర్పు హరిహారి పాడెదజరితన్
తరళీసు గాత్రా దరహార । కొఱతను నాట్య ధరధారి కూడెదమఱుగున్
హరినుతిపాత్రా హరిహార । వరమును జేర్పు హరిధారి వాడెదగరిమన్ 10

(మొదటిజోటిలెక్కను ఈ 10 జోళ్లకు (10 × 80, ఎ. మిదివర్ణదః కందములోనగూడగల్గు వివరింపబడినది. ఇంకను:-

వెఱపును దీర్పుము వేడెద । గరుడగమిత్రా కరుణను గరిహారగరహా
పరగను దీర్పుము పాడెద । హరివర నేత్రా చరితను హరిశరహరిహా
కొఱతను నాట్యము కూడెద । దరళీసు గాత్రా మఱుగును దరహారధరధా
వరమును జేర్పుము వాడెద । హరినుతిపాత్రా గరిమను హరిహారహరిధా 1
కరుణను వేడెదదీర్పుము । గరుడగమిత్రా వెఱపును గరిహారగరహా
చరితను పాడెదదీర్పుము । హరివర నేత్రా పరగను హరిశరహరిహా
మఱుగునగూడెదనాట్యము । తరళీసు గాత్రా కొఱతను దరహారధరధా
గరిమను వాడెదజేర్పుము । హరినుతిపాత్రా వరమును హరిహారహరిధా 2
గరుడగమిత్రా వేడెద । గరిహారనీకరుణదీర్పు గరహా వెఱపున్
హరివర నేత్రా పాడెద । హరిశరనీ చరితదీర్పు హరిహా పరగన్
తరళీసు గాత్రా కూడెద । దరహారనీ మఱుగు నాట్య ధరధా కొఱతన్

హరినుతిపాత్రా వాఁడెద । హరిహరనీకరిరుజేర్పు హరధామ నుతా 3
వెఱపునుదీర్పుము వేఁడెద । గరహారీ నీదుకరుణ గరుడగమిత్రా
పరగనుదీర్పుము పాఁడెద । హరిహారీ నీసునారిశ హరివరనేత్రా
కొఱతనువాఱుముకూఁడెద । ధర ధారీ నీదుమఱుఁగు తరళేశుగాత్రా
వరమునుజేర్పుము వాఁడెద । హరిధారీ నీదుకరిమ హరినుతిపాత్రా 4

(మూఁడిటికి నొక 4 జతలేని చూపఁబడినవి. ఏరగలవారి యోపికను బట్టి మఱికొన్ని జోడులు దొరకును. కాని పూర్వోత్తర పాదముల కర్థానుబంధముండుట చేతనివి జతలున్నన్ని యెనుబదులు మాత్రము కావు. అన్నిడజనులగుటకే యవసరముండదు. కొన్ని యెక్కువగను జిక్కవచ్చును. ఎట్టులాయెనేమి ఈసీసమున వేయికందాలు వెలువడును.)

పూర్వోక్తబహువిధ పదపద్యానేక సహస్రగర్భితాద్యంత సీసరాజేంద్రము — (కృష్ణానదీమాహాత్మ్యము) ధరధరత్వరగానుదటిగనితగుమయ్య కొఱతలు వాపఁగ వరములిమ్మి। గురువరగుఱిగాను గఱుతునెనిలుమయ్య యరులనుమాపఁగ మఱుఁగునిమ్మి । స్మరహరసరిగాను జరణములిడుమయ్య కరములుచాపఁగ శరణమిమ్మి। సురవరచోరఁగాను సురభినొసఁగుమయ్య కరుణనుజూపఁగ సురుచినిమ్మి॥ చంద్రసూర్యాగ్నిలోచన సమరభీమ । సాంద్రకారుణ్యభూషణ శమితకామ । అంద్రుసర్వేశ్వరాయునియమితనామ । కంద్రుదేవ లిసింగ నకముగసోమ ॥

(సురభి = మనోహరమైనపదార్థము. ఇతరపద్య వివరణమంతయును కృష్ణానదీమాహాత్మ్యమున సవిస్తారముగ గలదు, మనప్రకృతకందములు)

ధరధరతటిగనితగుమయ । వరములనిమ్ము త్వరగాను వాపఁగ కొఱతల్
గురువరగుఱుతునెనిలుమయ । మఱుఁగును నిమ్ము గుఱిగాను మాపఁగ నరులన్
స్మరహరచరణములిడుమయ । శరణమునిమ్ము సరిగాను జాపఁగ కరముల్
సురవరసురభినొసఁగుమయా । సురుచినినిమ్ము చోరఁగాను జూపఁగ కరుణన్ 1
ధరధర కొఱతలు వాపఁగ । త్వరగానా వరములీయ దటిగనితగుమా
గురువర యరులను మాపఁగ గురిగానా మఱుఁగునీయ గుఱుతునెనిలుమా
స్మరహరకరములు చాపఁగ । సరిగానా శరణమీయ జరణములిడుమా
సురవరకరుణను జూపఁగ । చోరగానా సురుచినీయ సురభినొసఁగుమా 2
త్వరగానువరములిమ్మా। ధరధర వాపఁగ కొఱతల్ తటిగనితగుమా
గుఱిగాను మఱుఁగునిమ్మా । గురువర మాపఁగ నరులను గుఱుతునెనిలుమా

సరిగానుశరణమిమ్మా । స్మరహరచాపగకరములు చరణములిడుమా
చోరగానుసురుచినిమ్మా । సురవరచూపగకరుణను సురభినొసగుమా 3
కొఱతలువాపగధరధర । త్వరగానేచగములిమ్మా తతిగనితగుమీ
అరులనుమాపగగురువర । గుఱిగానేమఱుగునిమ్మా గుఱుతునవనిలుమీ
శరములుచాపగస్మరహర । సరిగానేశరణమిమ్మా చరణములిడుమీ
కరుణనుజూపగసురవర । చోరగానేసురుచినిమ్మా సురభినొసగుమీ 4
కొఱతలువాపగద్వరగా । ధరధరయిమ్మానగములు తతిగనితగుమీ
అరులనుమాపగగుఱిగా । గురువరయిమ్మామఱుగును గుఱుతునవనిలుమీ
కరములుచాపగసరిగా । స్మరహరయిమ్మాశరణము చరణములిడుమీ
కరుణనుజూపగచోరగా । సురవరయిమ్మాసురుచిని సురభినొసగుమీ 5
వరములనిమ్మాకొఱతలు । త్వరగాబాపగధరధర తతిగనితగుమీ
మఱుగునునిమ్మాయరులను । గుఱిగామాపగగురువర గుఱుతునవనిలుమీ
శరణమునిమ్మాకరములు । సరిగాచాపగస్మరహర చరణములిడుమీ
సురుచినినిమ్మాకరుణను । చోరగాజూపగసురవర సురభినొసగుమీ 6
వరములనిమ్మాపాపగ । ద్వరగాకొఱతలుధరధర తతిగనితగుమీ
మఱుగునునిమ్మామాపగ । గుఱిగానరులనుగురువర గుఱుతునవనిలుమీ
శరణమునిమ్మాచాపగ । సరిగాకరములుస్మరహ చరణములిడుమీ
సురుచినినిమ్మాచూపగ । చోరగాకరుణనుసురవర సురభినొసగుమీ 7
త్వరగాదతిగనితగుమయ । వరములనిమ్మాధరధర పాపగకొఱతల్
గుఱిగాగుఱుతునవనిలుమయ । మఱుగునునిమ్మాగురువర మాపగనరులన్
సరిగాచరణములిడుమయ । శరణమునిమ్మాస్మరహర చాపగకరముల్
చోరగాసురభినొసగుమయ । సురుచినినిమ్మాసురవర చూపగకరుణన్ 8
తతిగనితగుమయత్వరగా । వరములనిమ్మాధరధర పాపగకొఱతల్
గుఱుతునవనిలుమయగుఱిగా । మఱుగునునిమ్మాగురువర మాపగనరులన్
చరణములిడుమయసరిగా । శరణమునిమ్మాస్మరహర చాపగకరముల్
సురభినొసగుమయచోరగా । సురుచినినిమ్మాసురవర చూపగకరుణన్ 9
తతిగనితగుమయధరధర । వరములనిమ్మాత్వరగను పాపగకొఱతల్
గుఱుతునవనిలుమయగురువర । మఱుగునునిమ్మాగుఱిగను మాపగనరులన్
చరణములిడుమయస్మరహర శరణమునిమ్మాసరిగను చాపగకరముల్
సురభినొసగుమయసురవర । సురుచినినిమ్మాచోరగను చూపగకరుణన్ 10
ధరధరత్వరగాదతిగని । వరములనీయంగదగుమి పాపగకొఱతల్

గురువరగుఱిగాగుఱుతున । మఱుగునునీయంగనిలుమి మాపగనరులన్
స్మరహరసరిగాఁజరణము । శరణమునీయంగనిడుమి చాపగగరముల్
సురవరచోరగానురభిని । సురుచిరనీయంగనొసగు చూపగగరుణన్ 11
ధరధరతగుమయత్వరగా । వరములనిమ్మాతఱిగని పాపగగొఱతన్
గురువరనిలుమయగుఱిగా । మఱుగునునిమ్మాగుఱుతున మాపగనరులన్
స్మరహరయిడుమయసరిగా । శరణమునిమ్మాచరణము చాపగగరముల్
సురవరయొసగుమిచోరగా । సురుచిరనిమ్మాసురభిని జూపగగరుణన్ 12
ధరాధరపాపగగొఱతలు । తఱిగనియిమ్మావరములు త్వరగాదగుమీ
గురువరమాపగనరులను । గుఱుతుననిమ్మా మఱుగును గుఱిగానిలుమీ
స్మరహరచాపగగరములు । చరణములిమ్మాశరణము సరిగానిడుమీ
సురవరచూపగగరుణను । సురభిననిమ్మాసురుచిర జోరగనొసగుమీ 13
ధరధరగొఱతలుపాపగ । త్వరగాదగుమయవరములు తఱిగనియిమ్మా
గురువరయరులనుమాపగ । గుఱిగానిలుమయమఱుగును గురుతుననిమ్మా
స్మరహరకరములుచాపగ । సరిగానిడుమయశరణము చరణములిమ్మా
సురవరకరుణనుజూపగ । జోరగానొసగుమిసురుచిర సురభిననిమ్మా 14
ధరధరవరములనిమ్మా । త్వరగాపాపంగగొఱత దఱిగనితగుమీ
గురువరమఱుగుననిమ్మా । గుఱిగామాపంగనరుల గుఱుతుననిలుమీ
స్మరహరశరణమునిమ్మా । సరిగాఁజాపంగగరము జరణములిడుమీ
సురవరసురుచిరనిమ్మా । చోరగాఁజూపంగగరుణ సురభినొసగుమీ 15

(ఈ విధాన నేరికూర్పగల సాధకుల యోపికకొలదిని మఱికొన్ని జతలు వెలువడగలవు. వెనుకటిపద్యమున నిదగపడబద్ధ లెక్కవాజోడులన్ని యెచుబమునో అన్నివీలుపడవేని కొన్నితక్కువగనో పడియును గుమురనియెడల నెల్ల దుదకాడజరులయెన్నికనో సమకూర్చ్పగా నీసీసముందును వేయికందాలు చిక్కవచ్చు)

---

# రామస్తవము.

— చిత్రకవిత్వము. —

(అధ్యాత్మ రామాయణామందలివి.)

ఆద్యికము— పదియారదిమ్ముల. దొరకగు । మొ:లిటి

కొమరుండ వగలమూకల ననులం । బొదిపిన జెట్టీయిదెవ్రొ । క్కఁడు బత్తింబుడమికూఁతుఁగూడి యలసుమా ॥

సాంస్కృతికము— నిరతాధర్మపరాసుర । వరరావణముఖ్య దుష్ట బాధితనిఖిలా । మరసంక్రందన వగీ । శ్వరభయహరణార్థ భార వహా శ్రీరామా ॥

సర్వాదంతము— ఘనసప్తాశ్వాన్వయ సా । ధనమఁట భవదమలచరణ దాస్యమరయఁగా । ననవరత భజనసడవఁగ । ననఘుతఁ బరమపదవాస మవసరమనఁగా ॥

త్రిప్రాసము— ధన్యుండవు హ్మృత సేవక । దైన్యుండవు సార్వభౌమ దశరథ రామా । మాన్యుండ వెల్లయెడలను । హాన్యుండవు వానినెల్ల నడఁచితిసుమ్మా ॥

త్రిప్రాసము— నిత్యుండవు పరిపాలిత । భృత్యుండవు దళిత భువన భీకర దుష్కృ। ద్దైత్యుండవు దయఁగను కృత। కృత్యుండవు నీవగుదువు కేశవదేవా ॥

చతుఃప్రాసము— మెలఁగుదువు భక్తులిండ్లను । గలుగుదువల వారుతలఁపఁగాఁ దద్హృదులం । జెలఁగుదువలరుదు వెలుఁగుదు । తొలఁగుదువే రామదాస దోషవిరామా ॥

చతుఃప్రాసము— సుందరుఁడవు బహుభోగ వు। రందరుఁడవు నిఖిలదేవ రక్షోద్ధృత న । న్మందరుఁడవు క్షీరోదధి। మందిరుఁడవు సర్వలోక మహితుఁడవభవా ॥

పంచప్రాసము— తలఁపవుగద మాగతిహరి । మెలపవుగద దిక్కుమాకు మిసిమింతులమే । నిలుపవుగద యీయెడ్డమి । కొలుపవుగద పేరివేఁజె కొలమిట్టాడన్ ॥

(మిసిమింతులు = అలసినవారు. ఎడ్డమి = ఆపద. మిట్టాడన్ = వర్తించుటకు)

నిస్తాలవ్యము— పరమకృపాకర భూమిా । ధ్వరదానవకమల మత్తవారణనాపైఁ। గరమనురాగముఁజూపుము। తిరముగ నినుఁగొలుచువాఁడ దీనుఁడ రామా ॥

నిరోష్ఠ్యము— అగడొందనైనచెడుగులు । దిగులుం గలిగించు నట్టి తెఱఁగులునింక । న్జగడాలుఁగలతలీర్ష్యలుఁ । డగదని తొలఁగించు చుండు దశరథతనయా ॥

నిరూష్మనిరోష్ఠ్యము— ధరజానాయకదయగల । దొర యెరని యరయరో యదొరకిం తండ్రీ । నరనాథాగ్రణియిఁక నా । కొఱఁతల నడుగంటఁ జేయఁ గూర్చుంపుకదా ॥

నిరూష్మనిస్తాలవ్యము— పరమపవిత్రా రామా । కరమాదర భావమొప్పఁగనుఁగొనుమప్పా । నిరుపాధికుండ భక్తుఁడ । నెఱుఁగుదు వే మొఱలున్నట్టు టిద్దొకతప్పా ? ॥

నిరూష్మనిరోష్ఠ్యనిస్తాలవ్యము— కలతెన్నొకందునిన్నం । దులఁ గానఁగఁగలుగదీనదుఃఖార్తిఁ తా । నలనీరనీరదాంగా । తొలఁగిత్తొ నాదరి నిఁ కేడదగాఱ వరిగిత్తో ॥

అంకగణితము— ఏకాద్విజవరతింభువన । శోకహాచతురా ప్రపంచసుమషట్చరణా । శ్రీకరసప్తాశ్వాన్వయ। మాంకష్టముమానవలయు మంచిదశయదే ॥

రసగుణితము— వరరాముఁగోరిరితఁడు । గురురూపిను దేవురై యొసదిరిరొయొనరా । నరనాథుని రతిసీచుల । నురినూకువనేర్పనైన న్రోపికనాఁగా ॥

(ఊరిఁ = ఉచ్చులో. ఊపనఁ = పూనికను, ఏర్పఁ = ఏర్పరచుట)

నవగ్రహి— రవికులవనధిశశికుజా । ధవబుధులను గురులఁ గవులధనగుణనైపు । న్గా విభవయుతులను జేయుము । రవిజాసురసేవ్య వృషభరాడ్ధ్వజభావ్యా ॥

దశావతారి— పరభూమీనులుకమఠము । కొఱకిటి రావా నరహరి కుఱుచలునేఁగా । దొర రామానుమ్మాలఁ గరుణించితిబుద్ధి తెలిసికలికియులరఁగన్ ॥

(కమఠము = భిక్షాపాత్ర, కిటి = వరాహము, కుఱుచ = వామన, ఒకదుస్తు)

సాంవత్సరి— తారణభావాసుధిరో । ద్గారివికృతిక్రోధ రౌద్రి ఖరరాక్షస నా । ధారణ విక్రమవిజయ వి,। కారి విరోధిశ్వర జయ!

ఘన! ప్లవవిభవా ॥

పంచాక్షరి— పరమకృపాకరనరవా ! మరవా నీప్రాపుకోరి మననున్న మను । న్నరకమునను నుపమానుము । కరమనుపమమైన ప్రేమకననిమ్మన్నా ॥

చతురక్షరి— రామాకామాకారా । మామకపాపమ్ముమాప మరపాపరాకో । పామరకర్మముకోపము । కామముమారకము కోరకేకా మురిపెమ్మా ? ॥

త్ర్యక్షరి— మాయయయ్యాయానమానని । నాయమ్మనినీమము నను నమ్మినయయ్యా । మాయామయ నీమానిని। యేయామాయమ్మ మైన! యేమాయానా ? ॥

ద్వ్యక్షరి— నీయున్న నాయనయెనగా । నోయీనీయానూన నున్నాననే । యాయనయునిన్ను 'నూ' యనె । నీయునినయానా నాయెనిన్నెన్నయా ॥

(నీయున్న నాయన = సముద్రుడు, ఊయనెన్ = కానిమ్మనె)

ఏకాక్షరి— నునినాన్న నాన్ననన్నని । ననునిన్నునునెన్న నాను నానెన్నె న్నే ।ననసూ నెనిన్ను నానే। నునునినునననూననున్న నోనానన్నా ?॥

(నునినాన్న నాన్నననినను = శివునిభార్యాతి [illegible]గా)

— బంధకవిత్వము. —

గోపురము— రామారామహితా మునమున । నీనూంబును [illegible]ని తలంతునినుంగనుగతిని । నానునుసెయనుదు మనుపవె । ప్రేమన్నత తంబుమీరు భృత్యుండఁగదా ॥

(7 అంతస్తులలోను 'రామనసుగవిహ', అనియుండి 4 వ చరణముతో [illegible] శివ్వయించును)

రథము— శ్రీదారాఘవనీమము । తోషైన్యముఁదేల్చ చూపు దూఁగదరావా । పాదానాత్రానికు । నోమ్మదావహా ప్రేమకలైనమురుపే వేన? ॥ (మురుపు = అందము)

(ఇందు శ్రీరామదేవాదాతపే వే, అనిపదమునిలుచును)

